A BOOK OF MY QUOTES

# అక్షరాలోచనలు

Volume-I



పరుమల భరత్

2019

Dedicated to all My Teachers...



# నా మాట

"ప్రతీ అక్షరం జనించేది సమాజహితం కోసం,
ఆ అక్షరం పుట్టుకకు కారణం సమాజం"

మనిషి ఆలోచన శక్తి కలవాడు,తన ఆలోచనలను ఇతరులతో పంచుకోగలడు,ఇదే మనిషికి ఉన్న గొప్ప వరం.అయితే తన ఆలోచనను అక్షరబద్ధం చేయటం ద్వారా తరతరాలు ఆ ఆలోచన చిరస్థాయిగా నిలుస్తుంది,పదిమందికి ఉపయుక్తంగా ఉంటుంది.ఈ సదుద్దేశ్యంతోనే నేను నిత్యం ఈ సమాజంలో గమనిస్తున్న విషయాలను, వాటిపై ఉన్న నా అభిప్రాయాలను, ఆలోచలను **'యువర్ కోట్'** అనే యాప్ లో రాస్తుంటాను. 2019 సంవత్సరంలో రాసినవన్నీ కూడా ఒక పుస్తక రూపంలో తీసుకువస్తే ఎలా ఉంటుంది అన్న ఆలోచనను వెంటనే ఆచరణలోకి తీసుకొచ్చాను.అక్షరాలోచనలు రూపంలో మీ ముందుకు తీసుకువచ్చాను.

'ధనం మూలం ఇదం జగత్' అన్నారు పెద్దలు,అందుకే 'అక్షరాలోచనలు' పుస్తకంగా తీసుకువచ్చే క్రమంలో ఏర్పడే ఆర్థికభారం నేను మోయలేను,నేనే కాదు ఈ సాహితీ ప్రపంచంలో అందరినీ వేధిస్తున్న సమస్య ఇది. మనసుంటే మార్గముంటుంది అన్నట్లు అంతర్జాల పుస్తకం (E-Book) గా విడుదల చేస్తే నాకు,చదువరులకు ఎలాంటి ఇబ్బంది ఉండదని భావించి దీన్నీ అంతర్జాల పుస్తక (E-Book) రూపంలో మీ ముందుంచాను.

చిన్నప్పుడు తెలుగంటే నాకున్న భయాన్ని పోగొట్టి,ఆ తెలుగు మాధుర్యాన్ని తెలియజెప్పిన మా మేనమామ శ్రీ బాగు రాజు గారికి (తెలుగు పండిట్), స్నాతకోత్తర విద్యాభ్యాసంలో పరిచయమై అడుగడుగునా నాకు దిశానిర్దేశం చేస్తూ నేను ఆప్యాయంగా పెద్దమ్మ అని పిలుచుకునే మా గురువులు శ్రీమతి చక్రహరి రమణ (తెలుగు అధ్యాపకురాలు) గారికి,నా కోసం నేను కూడా ఆలోచించలేనంత నిరతం నా అభివృద్ధిని కాంక్షిస్తూ, నిరంతరం నన్ను ముందుకు నడిపిస్తున్న మా గురువు గారు శ్రీ ఆనందం దుర్గాప్రసాద్ (గ్రంథపాలకులు) గారికి, తన జీవితమే ఒక పాఠశాలగా తలచి, నిరంతరాధ్యయనం చేస్తూ తాను నేర్చుకున్నది

ఇతరులతో పంచుతూ, తెలుగులో నేను రాసిన మాటలను ఎలా రాస్తే బాగుంటుందో నిత్యం సలహాలిస్తున్న అధ్యాపకురాలు శ్రీమతి పప్పుల శైలజ (తెలుగు అధ్యాపకురాలు) గారికి, ప్రతి నిత్యం చురుగ్గా ఉంటూ, తన చుట్టూ ఉన్నవారందరికి ఆనందాన్ని పంచుతూ, నేను ఆంగ్లంలో రాసిన మాటలకు తన అమూల్యమైన సలహాలు అందించిన శ్రీ పప్పుల సతీష్ కుమార్ గారికి, నాకు డిజైనింగ్ పరంగా సాంకేతికంగా సహాయం చేసిన మిత్రుడు శ్రీ వంగపల్లి రాజుకి కృతజ్ఞతలు తెలుపుతు, ఎప్పటికీ మీ ఆశీస్సులు నాపై ఇలాగే ఉండాలని కోరుకుంటున్నాను.

నా చిన్ననాటి నుండి నాకు తెలుగు భాషపై మక్కువ పెంచిన నా గురువులందరికీ హృదయపూర్వక కృతజ్ఞతలు.

నా ఆలోచనలు అక్షరరూపం దాల్చటానికి వేదికగా నిలిచిన **'Your Quote'** యాప్ వారికీ,అలాగే ఈ పుస్తకానికి కవర్ పేజీ డిజైన్ కొరకు నేను సహాయంగా తీసుకున్న **'CANVA'** యాప్ వారికీ ప్రత్యేక ధన్యవాదాలు.

'ఒక్క ప్రయత్నంతోనే విజయం రాకపోవచ్చు, కానీ ప్రతీ ప్రయత్నం మనల్ని విజయానికి చేరువ చేస్తుంది' నా ఈ చిన్ని ప్రయత్నాన్ని ఎలాంటి దోషాలు లేకుండా అనేకమార్లు నిర్ధారణ చేసుకున్నప్పటికీ ఏమైనా తప్పులు ఉండి ఉంటె పెద్ద మనసుతో క్షమించి, మీ ఆశీర్వాదాలు అందించగరని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను, అదే విధంగా మీ అభిప్రాయం,సలహాలు,సూచనలు parumala.bharath2@gmail.com మెయిల్ చేయగలరు.

సిద్దిపేట,

తేదీ:31-01-2020.

**పరుమల భరత్**

ఎం.ఏ తెలుగు ఉపన్యాసకులు,

ప్రభుత్వ డిగ్రీ&పిజి,కళాశాల,(స్వయం ప్రతిపత్తి)

సిద్ధిపేట, తెలంగాణ రాష్ట్రం.



# అక్షరాశీస్సులు...

అక్షరాలోచనలు అనే ఈ పుస్తకంలో ఉన్న అక్షరాలు ప్రతీ వ్యక్తి జీవితాన్ని స్పృశించే విధంగా ఉన్నాయి.జీవితాన్ని చాలా లోతుగా చదివి,మనిషి జివివితంలో అన్ని దశలలో వచ్చే కష్టనష్టాలను,వాటిని ఎదుర్కోవడంలో వచ్చే అవరోధాలను జయించడానికి అవసరమయ్యే మనోస్థైర్యాన్ని నింపే విధంగా ఈ పుస్తకం ఉంది.విద్యార్థుల,యువకుల,వయోజనుల బాధ్యలేమిటో తెలియజేసే విధంగా ఈ అక్షరాలోచనలు ఉన్నాయి. వసుధపై ఉండే ప్రతీ జీవి నుండి ఎంతో కొంత నేర్చుకోవడానికి అహం అడ్డురాకూడదని,జీవితమనే ప్రయాణంలో తమ మనసుకు ఉన్న వేగాన్ని నియంత్రించుకున్నప్పుడే జీవితం స్థిరపడుతుందని ఆలోచించేలా ఈ అక్షరాలోచనలు ఉన్నాయి.ఇలాంటి చిరు ప్రయత్నంలోనే చిరంజీవిగా వెలుగొందే ఈ అక్షరాలోచనలు పుస్తకాన్ని అందించిన మా అల్లుడు భరత్ కు హృదయపూర్వక అభినందనలు,ఆశీస్సులు.

**బాగు రాజు**

తెలుగు పండిట్,

జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల,

ఎర్రవల్లి,మం.కొండపాక,

సిద్ధిపేట, తెలంగాణ రాష్ట్రం.



# అక్షరం ఇక్షురసం

గురువులతో సహవాసం జ్ఞానాన్నిస్తుంది.
బంధువులతో సహవాసం భరోసానిస్తుంది.
మిత్రువులతో సహవాసం ఆనందాన్నిస్తుంది.
శత్రువులతో సహవాసం అభివృద్ధికి సూచకంగా నిలుస్తుంది.

-భరత్.

అనుభవంలో నుండి వచ్చిన ఈ మాటలు పాఠకుల మదిలో అబ్బురపరిచేవిగా ఆలోచింపచేసేవిగా ఉన్నాయి.విత్తునాటి నీరుపోసి సాగు చేసి తీగను పెంచితే ఆ తీగ ఎక్కడికెక్కడికో పాకి అక్కడే వారికి పూలను,పండ్లను అందజేస్తుంది.సిద్ధిపేట జిల్లా ప్రభుత్వ స్నాతక & స్నాతకోత్తర కళాశాల ఎం.ఏ తెలుగు శాఖలో విద్యార్థిగా విద్యనభ్యసిస్తూ తన జ్ఞానాన్ని అభివృద్ధి పథంలో నడిపిస్తూ ఇంట్లో తల్లిదండ్రుల నుండి కళాశాలలో ఆచార్యుల నుండి,మిత్రుల నుండి ప్రతి అంశాన్ని పరిశీలన,పరిశోధన దృక్పథంలో ఆలోచిస్తూ ఆచరణలోకి తీసుకువస్తూ, ఎం.ఏ.తెలుగులో ఉత్తమ శ్రేణిలో ఉత్తీర్ణుడై అతి చిన్న వయసులో రెండుమార్లు జాతీయ స్థాయి(UGC-NET)లో తన ప్రతిభను కనపరచి అదే కళాశాలలో ఉపన్యాసకునిగా ఉంటూ,తన జ్ఞానాభివృద్ధిలో భాగంగా సమాజంలో జరుగుతున్న ఆగడాలకు,సంతోషాలకు మరియు తన అనుభవాలకు అతి దగ్గరలో అల్లుకునే నీతి వాక్యాలను ఆశువు చెప్పడంతో పాటు,ఆ ఆలోచనా క్రమాన్ని వెంటనే అక్షరీకృతం చేసి అక్షరాలోచనలు చేస్తున్న చిరంజీవి భరత్ కు అభినందనలు.

"సంఘటన,ఆక్రోశం,బాధ,ఆవేదన,ఆలోచన,ఆచరణ,విజయం,వినయం,అద్భుత విజయం" అవును ప్రతి మానవుడు తన జీవితంలో తాను పడే ఆవేదనను ఆపి ఆలోచన క్రమాన్ని కొనసాగించి దాన్ని ఆచరిస్తే విజయం తన సొత్తువు అవుతుంది. 'భవిష్యత్ తరంవారి గమ్యాన్ని నిర్దేశించేది నేటి తరం వారే' ఇది వాస్తవం భవనం గట్టిగా ఉండాలంటే దాని

పునాది పటిష్టంగా  ఉండాలి మారుతున్న సమాజంతో పాటు అటు నాగరికత ఇటు పాశ్చాత్య పోకడలకు దగ్గరవుతున్న నేపథ్యంలో నేటి తరం వారు స్థిరమైతే భవిష్యత్తులో బంగారు బాట వేసుకున్నట్లే,ఉత్త,ఉత్తమ,అత్యుత్తమోపాధ్యాయుల గురించిన ఆలోచన అత్యుత్తమం.ఒకటేమిటి ఏ మాట చుసిన,చదివినా దానిలో నుండి నేర్చుకోవడానికి అత్యుత్తమంగా తోస్తున్నవే.

ఇలాగే భవిష్యత్తులో చక్కటి బంగారు బాటలు వేసుకొని,అత్యుత్తమ స్థానాలను అధిరోహిస్తూ,భవిష్యత్తరాల వారికి ఆదర్శంగా నిలుస్తావని ఆకాంక్షిస్తూ...

**చక్రహరి రమణ**

ఎం.ఏ తెలుగు ఉపన్యాసకులు,

ప్రభుత్వ డిగ్రీ&పిజి,కళాశాల,(స్వయం ప్రతిపత్తి)

సిద్ధిపేట, తెలంగాణ రాష్ట్రం.




## పుస్తక సందేశం

ఈ " అక్షరాలోచనలు" అనే "E-పుస్తకం" లో ఉన్న సందేశాలు ప్రతి వ్యక్తిత్వ నిర్మాణానికి-ఆలోచన విధానం, ప్రజా సంబంధాలు, ప్రతీ వ్యక్తి జీవన విధానం ఒక ప్రత్యేకత తో కూడుకొని ఉన్నదని, ఉపాధ్యాయుడు ద్వారా సమాజాభివృద్ధి ఆధారపడి ఉందని, సమాజంలో సమానత్వం అవసరమని, మహాసంకల్పం సైతం చిన్న ప్రయత్నంతోనే ప్రారంభమవుతుందని, బాగున్నావా అంటారు కానీ సహాయం ఉండదు, సానుభూతి కంటే సహాయం అవసరం. అన్ని రంగాల్లో బాధ్యతతో సమస్యలు ఎదుర్కొంటూ తన జీవిత మలుపులకు మాతృభాషను వాడుకునే విధానం ఎంతైనా అవసరమని, గురు శిష్య సంబంధం ఆచరిస్తే ఎంతో ఫలితాలను సాధించవచ్చని, ఏం ఆశించని చెట్లు ఎంతో గాలినిస్తున్నాయి అలాగే మానవత్వ సమానత కోణం ఎంతో అవసరమని అద్భుతంగా చెప్పాడు.

ఒక మంచి వాక్యం రాస్తే దాన్ని ఎంతో మంది చదువుతారు, వాళ్లు చదివేటప్పుడు చదువు రాని వాళ్లు విని తెలుసుకుంటారు, వాళ్లు చెప్పగా మరికొంతమందికి తెలుస్తుంది, అలా అది లక్షల మందికి తెలిసే అవకాశం ఉంటుంది అంటే ఆ మంచి వాక్యం లోని విషయం అన్ని మెదళ్లకు చేరుతుంది అక్షరం ఆలోచింప చేస్తుంది. ఆ మేరకు వాళ్ళ ఆలోచనలను ప్రభావితం చేస్తుంది అక్షరం అంత విలువైనది. ఇలాంటి అక్షర ఆలోచనలు ఎన్నో ఉన్నాయని తెలుపుతూ,ఇంకా ఇలాంటి పుస్తకాలు అనేకం తీసుకురావాలని మా భరత్ కు అక్షర ఆశీస్సులు తెలియజేస్తూ...

**ఆనందం దుర్గాప్రసాద్**

అసిస్టెంట్ ప్రొఫెసర్ గ్రంథాలయ సమాచార శాస్త్రం,

నాగార్జున ప్రభుత్వ కళాశాల,(స్వయం ప్రతిపత్తి)

నల్లగొండ, తెలంగాణ రాష్ట్రం.



## అద్భుతాలోచనలు

Begun with the end in mind అంటారు stephe covey అలా అంతాన్ని దృష్టిలో పెట్టుకొని ఆరంభించబడినవే ఈ అక్షరాలోచనలు.భరత్ సమాజం గురించి మంచి అవగాహన, సమాజాన్ని మార్చలన్న తపన, తను, తనతో పాటు తోటివారు కూడా అందలమెక్కలన్న ఆరాటం,ప్రస్తుత కాలంలో విలువలను డబ్బుతో మాత్రమే వెలకడుతున్నారన్న ఆవేదన, సమస్యలను సవాళ్ళుగా ఎదుర్కోగల గుండె ధైర్యం,శత్రువులు అంతా నాకు జగద్గురువులే అని ప్రకటించగల్గిన పరిపక్వత, సానుకూల దృక్పథం కలిగిన వ్యక్తి కలాన్ని హలంగా మార్చి అక్షరాసేద్యం చేస్తున్న రైతు,ఒక విజన్ కలిగిన దార్శనికుడు.

ఈ కొటేషన్స్ లో ఇతరులకు ప్రేరణ కలిగించే విధంగా ఉన్నవే ఎక్కువ. "పెద్ద లక్ష్యాలని సాధించే క్రమంలో చిన్న, చిన్న అపజయాలు సహజం"అంటాడు. అపజయాలు కలిగాయని కుంగిపోకుండా ముందుకెళ్ళాలని చెపుతాడు.'మనం చేయాల్సిన పని మనకు భారంగా మారింది అంటే మనం మరాల్సిన సమయం ఆసన్నమైందని అర్థం'అని చక్కగా జీవిత సత్యాన్ని చెప్పాడు.ఏది శాశ్వతం కాదు, నిరంతరం మార్పు చెందడమే అసలు సత్యం అంటాడు.చిరంజీవి భరత్ తొలి ప్రయత్నంలోనే తన ఆలోచనలకు చక్కటి అక్షర రూపం ఇవ్వగలిగాడు, ఇలాంటి మరిన్ని రచనలు ఆశిస్తూ, ఆశీర్వదిస్తూ...

**పప్పుల శైలజ**

అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలుగు శాఖ

ప్రభుత్వ డిగ్రీ&పిజి,కళాశాల,(స్వయం ప్రతిపత్తి)

సిద్ధిపేట, తెలంగాణ రాష్ట్రం.



**MESSAGE:**

I am delighted about “AKSHARALOCHANALU” which is an E-Book prepared by Mr. P. Bharath, Lecturer in Telugu (PG), Government Degree & PG College, Siddipet (Autonomous) to disclose his thoughts.

It is gratifying to note that the quotes of this book will reflect relationships, efforts, success, hard work and life of a human being.

I am happy to note that there will be an immense scope for the teacher who paves a way for students and change the society in a positive avenue.

I wish Mr. P. Bharath for his constant, continuous and scholastic activities in the field of literature.

**By**

**P. SATEESH KUMAR**
**Lecturer in Chemistry (PG)**
**Govt. Degree & PG College (A), Siddipet**


శతాధికానుభవాల నుండే శాస్త్రీయత జనిస్తుంది.
– భరత్...
YourQuote.in


కొంతమంది మూర్ఖులు నిర్లక్ష్యంగా చేసిన పాపాలకు అమాయకులు బలవుతూ, శిక్షలను అనుభవిస్తున్నారు.
— భరత్...
YourQuote.in

భవిష్యత్ తరం వారి గమ్యాన్ని నిర్దేశించేది
నేటి తరం వారే.

– భరత్...

YourQuote.in

పెద్ద లక్ష్యాన్ని సాధించే క్రమంలో
చిన్న చిన్న అపజయాలు సహజం.

— Bharath...

YourQuote.in

మన జీవితంలో జరిగే మంచి సంఘటన
తర్వాత చెడు జరుగుతుందో లేదో కానీ
ప్రతీ చెడు సంఘటన తర్వాత ఖచ్చితంగా
గొప్ప మంచి జరుగుతుంది.

— భరత్...







మాటలు నేర్పే తల్లి ఒక గురువు
నడకను నేర్పే తండ్రి ఒక గురువు
బడిలో పాఠం నేర్పే ఉపాధ్యాయుడు ఒక గురువు
ఆనందాన్ని పంచే మిత్రువు ఒక గురువు
బాధను పెంచే శత్రువు ఒక గురువు
బాధ్యతని గుర్తుచేసే భార్య ఒక గురువు
ఆ బాధ్యతను నిర్వర్తించే భర్త ఒక గురువు
ముసలితనాన మోసం చేసే కొడుకు ఒక గురువు
ఆఖరి క్షణాలలో ఆదుకునే కూతురు ఒక గురువు.
సమస్తం గురుమయమైన ఈ జగత్తులోని జీవరాశులందరికీ
గురుపూర్ణిమ శుభాకాంక్షలు.

— భరత్...



గత ప్రపంచపు సంస్కృతి నాగరికతను కాపాడుతూ ఆ
సంప్రదాయాన్ని నేటి సమాజానికి పంచుతున్న గిరిపుత్రులకు
ప్రపంచ గిరిజన దినోత్సవ శుభాకాంక్షలు

— భరత్...



గత పరిచయం నేడొక జ్ఞాపకం
ఎప్పటికీ జ్ఞాపకం కానిది స్నేహం
మరచిపోతే గుర్తుచేసేది దినోత్సవం
మరెందుకీ స్నేహితుల దినోత్సవం?🤔
చెదిరిపోని మన చెలిమిని మరింత చేరువ చేసేందుకేనేమో...😍
మిత్రులందరికీ స్నేహితుల దినోత్సవ శుభాకాంక్షలు

— భరత్...



గురువులతో సహవాసం జ్ఞానాన్నిస్తుంది
బంధువులతో సహవాసం భరోసానిస్తుంది
మిత్రులతో సహవాసం ఆనందానిస్తుంది
శత్రువులతో సహవాసం అభివృద్ధికి సూచకంగా నిలుస్తుంది.

– భరత్...

YourQuote.in

'సంఘటన' వ్యతిరేకమైతే 'ఆక్రోశం'.
ఆక్రోశంలోంచి పుట్టుకొచ్చిందే 'బాధ'.
బాధ చెందిన మనసుకి కలిగేది 'ఆవేదన'.
ఆవేదనను ఆపేస్తే వచ్చేదే 'ఆలోచన'.
ఆలోచన అమలుచేస్తే అది 'ఆచరణ'.
ఆచరిస్తే తప్పక వచ్చేది 'విజయం'.
విజయం వచ్చాక కూడా 'వినయం'గా ఉండు.
ఆ వినయమే సాధించిపెడుతుందోక 'అద్భుతమైన విజయం'.

– భరత్...

YourQuote.in

గురువుకి శిష్యునికి మధ్య ఉన్న బంధం
తండ్రికి బిడ్డకు ఉన్న బంధంతో సమానం.
ఎందుకంటే గురువు ఒక తండ్రి వలె శిష్యున్ని
ఆడిస్తాడు.పాడిస్తాడు.నవ్విస్తాడు.
జీవితంలో పాఠాన్ని. జీవితం నేర్పే గుణ పాఠాన్ని తెలియజేస్తాడు.
-భరత్...



తమ జీవితంలో కష్టపడే వారికి సిద్ధిని
ఇతరుల జీవితాలపై పడే వారికి బుద్ధిని
లోకనాశనం కోరే వారికి జ్ఞానాన్ని
లోకకళ్యాణం కోసం పోరాడే వారికి విజ్ఞానాన్ని
ఇవ్వాలని ఆ భగవంతున్ని కోరుకుంటూ...
అందరికీ వినాయక చవితి శుభాకాంక్షలు
-భరత్...



నా గురువుల్లో ఒక్కరు కూడా శత్రువులు లేరు
కానీ నా శత్రువులంతా నాకు జగద్గురువులతో సమానం...
-భరత్...

YourQuote.in

ప్రాచీన తెలుగు వెలుగులు
తెలంగాణ ప్రజల పలుకులు
అచ్చ తెలుగుని ఆదరించి
తెలుగు భాషపరిరక్షణకై పోరాడి నిలిచి
భాషనే ఉద్యమానికి బాసటగా చేసుకొన్న
తెలంగాణ ప్రజలకు 'తెలుగు భాష దినోత్సవ' శుభాకాంక్షలు
-భరత్...

YourQuote.in

ఒక విద్యార్థి పరీక్ష రాసేటప్పుడు భయపడ్డాడంటే ప్రిపేర్ కాలేదని
అదే విద్యార్థి ప్రిపేర్ అయ్యేటపుడు భయపడ్డాడంటే జాగ్రత్తగా ఉన్నాడని అర్థం.
-భరత్...



YourQuote.in

ఒక మహిళ పొగరుగా మాట్లాడితే అది కేవలం పొగరని అనలేం
అది స్త్రీ మూర్తికి తన అస్థిస్త్వములోంచి వచ్చిన ఆత్మగౌరవం
అది ఒక దేశపు జెండాకి ఉన్న గౌరవం కన్నా ఎక్కువ.
వీరనారి చాకలి అయిలమ్మకి జోహార్లు...🙏
-భరత్...



YourQuote.in

తన విద్యార్థి కన్నా తన ఎదుగుదలను మాత్రమే కోరే వారు
'ఉత్త ఉపాధ్యాయులు'.
తన కంటే తన విద్యార్థి ఎదగాలని కోరే వారు
'ఉత్తమ ఉపాధ్యాయులు'.
తాను నిరంతరం విద్యార్థిగా ఉంటూ తన విద్యార్థుల
ఎదుగుదలకి కృషి చేసేవారు
'అత్యుత్తమ ఉపాధ్యాయులు'.
-భరత్...



మనిషి తనకి ఇష్టమైనది
శాశ్వతంగా తన స్వంతం కావాలనుకుంటాడు.
అయితే తన ఇష్టాలు నిరంతరం మారుతుంటాయనే
విషయాన్ని మర్చిపోతుంటాడు.
-భరత్...



నాణ్యత లేని నిర్మాణం
ఆప్యాయత లేని బంధం
ఎక్కువ కాలం నిలవవు...
-భరత్...

YourQuote.in

ఈ ప్రపంచంలో ప్రత్యర్థి లేని వ్యక్తి జీవితం వ్యర్థమే...
-భరత్...

YourQuote.in


ప్రతీ ఉదయం సూర్యోదయం అవుతుంది కానీ
నీలో జ్ఞానోదయం అయినపుడే నీ జీవితంలో వెలుగు వస్తుంది.
-భరత్...
YourQuote.in


మార్పు తెచ్చే శక్తి నీలో ఉన్నప్పుడు
మాటలు చెప్తూ ఆ శక్తిని వృధా చేయకు...
-భరత్...
YourQuote.in

బలమైన భవిష్యత్తుని నిర్మించుకోవటం అంటే
అవకాశాల్ని అందిపుచ్చుకోవటమే కాదు
అవరోధాలని అధిగమించడం కూడా...
-భరత్...

YourQuote.in

మనిషికున్న సమస్యని సౌకర్యంగా మార్చటమే అభివృద్ధి
కానీ ఆ సౌకర్యం మరో సమస్యకి కారకం కాకూడదు...
-భరత్...

YourQuote.in

స్వతహాగా ఆలోచించగలిగే వారికే శత్రువులు ఉంటారు...
-భరత్...

YourQuote.in

ఎదుటివారు నిన్ను అసహ్యించుకునే స్థాయి నుంచి వాళ్ళు
నిన్ను చూసి అసూయపడే స్థాయికి ఎదగటమే విజయమంటే...
-భరత్...

YourQuote.in

బాధను మర్చిపోయిన ఆనందకర క్షణమే సంతోషం
ఆ సంతోషాన్ని గుర్తుచేసుకొని నవ్వే పరిస్థితి రావటమే బాధ
-భరత్...







మనం చేయాల్సిన పని మనకు భారంగా మారుతుంది అంటే
మనం మారాల్సిన సమయం ఆసన్నమైందని అర్థం.
-భరత్...




YourQuote.in
ప్రతీ ప్రయత్నం నీకు విజయాన్ని ఇవ్వకపోవచ్చు
కానీ ఆ విజయానికి నిన్ను చేరువ చేసేది ఒక చిన్న ప్రయత్నమే.
-భరత్...


నిన్ను ఎప్పటికీ మోసం చేయకుండా.నీ నుంచి ఎప్పటికీ ఏమీ ఆశించకుండా
నీతో నిస్వార్థంగా స్నేహం చేసేది ఒక్క పుస్తకం మాత్రమే.
-భరత్...
YourQuote.in

నువ్వేం చేసిన విమర్శించే వాడు శత్రువు
నువ్వేదైన తప్పు చేస్తే చెప్పేవాడు మిత్రువు
నువ్వు తప్పు చేస్తే సరిదిద్దేవాడు గురువు
-భరత్...





ప్రతీ మనిషి జీవితం ఒక పాఠం అయితే
ఆ పాఠాలన్ని చదువుతున్న జీవితం నాది...
మన జీవితంలోని సంఘటనలు
అన్ని పుస్తకంలో ఉండకపోవచ్చు
కానీ పుస్తకంలో ఉన్న పాఠాలన్ని జీవితంలో జరిగిన
సంఘటనలను ఆధారంగా చేసుకొని రాయబడ్డవే...
-భరత్...

ఈ సమాజంలో...
చెట్ల నుంచి వచ్చే ఆక్సిజన్ కన్నా
ఆ చెట్ల నుంచి వచ్చే ఫలాలకే విలువ ఎక్కువ.
-భరత్...






ఈ సమాజంలో నేను గొప్పవాన్ని కాకపోవచ్చు
కానీ గొప్ప ఆలోచన శక్తి కలవాన్ని.
-భరత్...



కొంతమంది ఎలా ఉంటారంటే...
మనం బాధలో ఉన్నప్పుడు ఓదార్చిన వాళ్ళే
మనం బాగుపడితే చూసి ఓర్వలేరు.
-భరత్...



YourQuote.in

మనిషిపూర్వం జంతువులను మచ్చిక చేసుకుని వాడుకున్నాడు.
నేడు మనుషుల రూపంలో ఉన్న గొర్రెల్ని మచ్చిక చేసుకొని ఆడుకుంటున్నాడు.
-భరత్...



YourQuote.in

మనిషి నైజం...
ఫలం ఇవ్వటం లేదని ప్రాణవాయువు ఇచ్చే చెట్టునే నరికేస్తారు.
నీ అవసరం ఇక లేదని తెలిసాక నీతో స్నేహం ఎలా కొనసాగిస్తారు.
-భరత్...





గొప్ప ఆలోచనలు కూడా
చిన్న ఆచరణతోనే
అద్భుతాలుగా నిలిచిపోతాయి.
-భరత్...

YourQuote.in

'పెరుగుట విరుగుట కొరకే' అంటారు
కానీ విరిగినా మళ్ళీ పెరగటం చెట్టు నైజం
ఇదే కదా మనిషి జీవితానికి ప్రకృతి నేర్పే పాఠం
-భరత్...

YourQuote.in

జీవితంలో సమస్యలొచ్చాయని భాదపడకు మిత్రమా!
సమస్యలను సవాళ్ళుగా ఎదుర్కోవటంలోనే ఉంది
ఈ సమాజంలో నీ గుర్తింపు.
-భరత్...

YourQuote.in

డ్రైవింగ్ అంటే వేగంగా వెళ్ళటమే కాదు.
వేగంగా వెళ్ళినప్పుడు నియత్రించగల్గటం.
గొప్ప వ్యక్తిత్వం అంటే ఉన్నతస్థితికి ఎదగడమే కాదు.
ఉన్నతస్థితిలో ఉన్నప్పుడు దాన్ని నిల్పుకోగల్గటం.
-భరత్...

YourQuote.in

నీ దగ్గర ఏ ఆయుధం ఉన్నదన్నది కాదు.
ఉన్న ఆయుధాన్ని నువ్వు ఎలా వాడవన్నది ముఖ్యం.
రైతుకు ఆయుధం హలం.
విద్యార్థికి ఆయుధం పుస్తకం.
-భరత్...



గొప్ప మనసుతో చెప్పే మాటలు ఎవరికి గొప్పగా అనిపించకపోవచ్చు
కానీ గొప్ప స్థాయిలో ఉన్నవాళ్ళు చెప్పే వట్టి మాటలు కూడా
గొప్పమాటలుగా గుర్తించబడతాయి...

@భరత్#

సాటి మనిషి కష్టంలో ఉన్నపుడు, ఆ
కష్టాన్ని తీర్చగల శక్తి నీకు ఉన్నా కూడా
నువ్వు ఆ వ్యక్తికి సహాయం చేయలేదంటే
నువ్వు మరణించినట్లే లెక్కా!
✍భరత్...

మనమే ప్రపంచం అనుకుని వచ్చే
అమ్మాయి ప్రపంచాన్ని అందంగా
తీర్చిదిద్దటం మన బాధ్యతా ఎందుకంటే
అందమైన ప్రపంచంలో జీవించటమే కదా
ఆనందం అంటే...

@భరత్




చాలామంది తమ సమస్యకి పరిష్కారం పక్కనే ఉన్నా
పట్టించుకోకుండా ఓదార్పునే కోరుకుంటారు...
✍️భరత్...


మనుషులు జీవించటం జంతువుల నుంచి నేర్చుకున్నారు
సింహం నుంచి ధైర్యాన్ని
నక్క నుంచి జిత్తులమారి తనాన్ని
కోతి నుంచి చిలిపితనాన్ని
గొర్రె నుంచి ఎవరేం చెప్పిన నమ్మటాన్ని
అయితే చాలా మంది గొర్రెల్లాగే బతుకుతున్నారు
ఎందుకంటే అడవిలో సింహాలకన్నా గొర్రెలే ఎక్కువ కదా...
✍️భరత్...


ఒకప్పుడు మనుషులు చేసిన కృషికి గుర్తింపుగా అవార్డులు ఇచ్చేవారు.
ఇప్పుడు మనుషులు అవార్డులు పొందటం కోసమే కృషి చేస్తున్నారు.
-భరత్...
YourQuote.in


ఎవరైనా ఎదుటివారిని బాగున్నవా అని అడుగుతారు
కానీ వారు బాగుండటానికి ఏ సహాయం చేయరు,
ఒకవేళ ఎదుటివారు బాగుంటే చూసి ఓర్వలేరు...
✍️భరత్...


ఈ ప్రపంచంలో మనిషిగా పుట్టినపుడు బతకడం నేర్చుకోవాలి
బతకడమే తెలియకపోతే నిన్ను బలిపశువుని చేసి ఆడుకుంటుందీ లోకం...
✍️భరత్...


మనిషి జీవితంలో అత్యంత కష్టమైన పరిస్థితి
ఏంటంటే మన వాళ్ళే మనల్ని నమ్మకపోవటం.
-భరత్...
YourQuote.in

ప్రజాస్వామ్యంలో ప్రజలు చాలా మూర్ఖులు
నిస్వార్థంగా ప్రజలకు సేవ చేద్దామని రాజకీయాల్లోకి వచ్చిన నాయకులకు పోటీ
పెట్టి ఓడిన వాన్ని చూసి పైశాచికానందాన్ని పొందుతారు.
గెలిచిన వాళ్ళ కాళ్ళ దగ్గర పడి పని చేయించుకోవడం కోసం ప్రాధేయపడతారు...
-భరత్..



YourQuote.in

నీ ఉనికినే ప్రశ్నించినోడికి నీ ఉన్నతిని
చూపడమే అసలైన విజయం.
✍భరత్...



@భరత్#

మనిషి తన మనసుకి తాకిన భావాల పరంపరకు అక్షరరూపమే కవిత్వం

✍️భరత్...

@భరత్#

TEST-Time for the Examination of student's Talent.

నికష-విద్యార్థి యొక్క ప్రతిభను పరీక్షించే సమయం.

~Bharath...

NTA NET EXAM




@భరత్#

కలం అనే హలంతో తన మెదడును చదును చేసి
జ్ఞానమనే విత్తనాల్ని నాటి అక్షర సేద్యం చేసి విజ్ఞానమనే
ఫలాన్ని ప్రపంచానికిచ్చే విద్యార్థి కూడా రైతు వంటి వాడే...
✍️భరత్...

@భరత్#

మంచి వారిని ఈ సమాజంలో చెడ్డవారిగా చిత్రించగలరేమో
కానీ వారి సద్గుణాలని వారి నుంచి దూరం చేయలేరు.
ఎలాగంటే,హంసపై బురదజల్లితే తాత్కాలికంగా
దాని రంగు మారుతుందేమో కానీ
పాలని, నీళ్ళని వేరుచేసే గుణాన్ని మార్చలేరు కదా!
✍️భరత్...

ఈ లోకంలో సహాయం చేసేవారి కన్నా
సానుభూతి తెలిపే వారే ఎక్కువ...
ఎందుకంటే, సహాయం చేయటం కంటే
సానుభూతి తెలపటం సులువైన పని కదా!
✍️భరత్...

@భరత్#





గాలి మాటలు నమ్మి దారిచూపే దీపాన్ని ఆర్పేస్తే కారుచీకట్లు
కమ్మున్నకున్న జీవితమనే కారడవిలో ముందడుగు వేయలేము.
దారిచూపే దీపపు కాంతులు కావాలంటే
ఆ కాంతి నుంచి వచ్చే ఉష్ణాన్ని భరించాల్సిందే.
✍️భరత్...



కొన్నిసార్లు నోటు విలువ కన్నా
మనిషి మాట విలువ చాలా గొప్పది.
✍️భరత్...


@భరత్#
Some Indians are Great Thinkers
Some Foreigners are Great Achievers
But They achieved Things based on Indian thoughts
✍️ Bharath...

Teaching is not a job it's a responsibility.
A teacher can built a generation,good or worse.

— Bharath...



YourQuote.in

Thinkers are great achievers
When their thought becomes an action.

— Bharath...

YourQuote.in


YourQuote.in
Create things, which are destroyable.
If it undestroyed, your life would be...
— Bharath...


You would be succeed,when your goal
becomes a Need...
— Bharath...
YourQuote.in


Other's Opinion could be changed in various situations
But never change your attitude for others.
— Bharath...
YourQuote.in


Never predict your life,just enjoy it
Because we can't expect climax of a suspense
thriller movie after watching 20minutes.
— Bharath...
YourQuote.in

YourQuote.in

Sometimes loneliness going to achieve something great.

– Bharath...

There are certain people fight for equality But No one can achieve it, Because,all states of equality in human life is impossible ever.

– Bharath...

YourQuote.in

Every person has three things commonly
1.Emotion
2.intelligence
3.Logic
We have to Balance 'Emotion and Intelligence' with a 'Logic' in Various Situations.

— Bharath...

YourQuote.in

YourQuote.in

One and only person in the world,
Who makes us from Zero to Hero,
He/She is the 'Teacher'...

— Bharath...

Most Foolish thing is to set of a life goal
Because we should have goals in our life.
Life goal take as much life time to reach it.

— Bharath...

YourQuote.in

*A failure is not just a failure*
*It's a different Learning procedure,*
*what We can't to do,we need to do.*

*— Bharath...*

YourQuote.in


A 'Manager' gives temporary solution to the permanent problems.
An 'Administrator' gives permanent solution to the temporary problems.
— Bharath...
2020
HELLO REVIVAL
YourQuote.in


An Engineer,
makes Dreams of the people comes True.
Happy Engineer's Day...
— Bharath...
YourQuote.in




Everyone should have a great Lifestyle
Because Successful Lifestyle always
gives you Success in your life...

— Bharath...



A LEARNER WOULD BECOME A TEACHER OR NOT,
BUT A TEACHER SHOULD BE A GREAT LEARNER.

— BHARATH...







We can express Human Mindsets Economically,
A women like Micro Economics,
A man like Macro Economics,
When Both together it's Become Welfare Economics.
✍️ Bharath...
@భరత్#


@భరత్#
Bad Experiences are makes our Life Great
Because Great Thoughts come From Bad Experiences.
✍️ Bharath...

A person must have to go...
'Gym' for physical fitness,
'Library' for mental fitness.




YourQuote.in

People can get results,
facing of risks in some situations,
when they see the risks as resources,
it just because of changing thought process.

— Bharath...




@భరత్#
We don't pray to Justice,We need Ethics.
Because prevention is better than cure.
✍️ Bharath...

Reading to learn is a resource,
not just a learning process...

— Bharath...




నా ఈ చిరు ప్రయత్నం గురువులందరికీ

అంకితం...